కల్గి చివురాకుపందిళ్లు ♦ గల్గి యొప్పె
నారదర్షి కుటీరంబు ♦ నవ్యశోభ. ౬౨

గీ. పుణ్యవతి పుణ్యజనభర్త ♦ పుణ్యఫలము
పతినియోగాగ్ని మఱుఁగుచు ♦ వనటఁ బరుల
పంచ బ్రదుకవలసెఁ దొంటి ♦ బామునందు
నెట్టికొఱనోములను నోచి ♦ పుట్టినానొ. ౬౩

గీ. అనుచు మాటిమాటికి నుసు ♦ రుసురనుచుఁ
బ్రాలుమాలిక మ్రొగ్గ ని♦బ్బరము తగ్గ
నురసి లీలావతీదేవి ♦ యొక్కనాఁడు
పండువెన్నెలఁ బవళించి ♦ పాలుపోక. ౬౪

వ. ప్రేకటప్రొద్దులం దనకు సంభవించిన కడగండ్లమాటఁ దలపోసి
కొనుచుఁ బూర్వవైభవంబు దలంచికొని పొంగిపొంగి పొరలి
వచ్చు శోకంబు నాపుకొని లోలోనఁ గుములుచు, ౬౫

సీ. గీర్వాణి వచ్చి వా♦కిట వేచి యున్నది
యని చెప్ప నూకొట్టు ♦ నట్టి యొడుపు
ఇంద్రాణి కబురంప ♦ నేమితొందర యంచుఁ
గనుసైఁగతోఁ జెప్పి ♦ యనుపు సొరు
మారాణిదూతిక ♦ మనవి యొక్కటి తెచ్చె
నని చెప్పఁగా వినీ ♦ విననితీవి
శర్వాణి తన్నొక్క♦సారి రమ్మనెనన్న
వచ్చుచుంటిననటంచు ♦ పలుకు సొబఁగు

గీ. తలఁచికొనుచు మనస్సులోఁ ♦ గలఁతపడుచుఁ
గాలవైపరీత్యమున క♦క్కజము పడుచు

దిక్కుమాలిన దైవంబు ♦ తెచ్చిపెట్టి
నిట్టియిక్కట్టు తారార! ♦ యేమి తగవు ? ౬౬

గీ. కాలునిచిన యూరు ♦ కాయూరు పుట్టిల్లు
పాఱుటాకుటోర ♦ పాకసంప
పురుడు పోయు తల్లి ♦ మునిపల్లెలోఁ బుట్టి
యేమి తెలియనట్టి ♦ యెట్టిరాత్రి. ౬౭

గీ. ఉగ్గుఁ బాలు పోసి ♦ యుంచరా నాయన్న!
యేడ్వఁబోకు మంచు ♦ నేడు పుడిపి
పూలతొట్టిఁ బెట్టి ♦ బోరుకాడించుట
యడవిపల్లెఁ బుట్టి ♦ నట్టి పడుచు. ౬౮

సీ. జోజో యటంచును ♦ జోలపాటలు పాడి
పొత్తిగిళ్ళలో బిడ్డఁ ♦ బొదిగిపెట్టి
వినరాని పాటలు ♦ వినిపింప వినవచ్చె
దిక్కుమాలిన నాఁడు ♦ జరుపు లేదు
తులలేని బంగారు ♦ తూఁగుటుయ్యాలలో
ముందూఁగవలసిన ♦ ముద్దుబిడ్డ
కడిమిచెట్టులక్రిందఁ ♦ గడిమితోఁ గట్టిన
తీగయుయ్యాలలో ♦ నూఁగవలసె

గీ. ద్రవిడరాజన్య రత్నసం ♦ స్థగితమైన
పైఁడిగద్దెపైఁ గూర్చుండు ♦ వాఁడు నేఁడు
కాడు లోమునిపల్లెలో ♦ గాపురంచు
నేడ్వ నాలించువా రొక్క ♦ రేని లేరు. ౬౯

౭౦. అనియిట్లు చింతించుచు, నింటివేల్పునకు మ్రొక్కిడుచుఁ దలఁపులు నలుదెసలకుం జెదరిపోవఁ జేయునది లేక, యాయాన

పడుచు, నిందుచూలాలితనంబున దిగులువడుచు, నాయంత
ర్వాత్మ కన్నుమూఁతపెట్టుచుండ. ౭౦

గీ. మహతి చేఁగొని నారద ♦ మునివరుఁడు
తరుణ మరుదెంచె నని చెప్పి ♦ తారి తారి
నాల్గుదిక్కులు పరికించి ♦ నవ్వుకొనుచు
నిట్లు హృదయమ్ములో నిశ్చ ♦ యించుకొనియె. ౭౧

గీ. అభిజాత్యము గల్గిన ♦ యట్టి మాన
వతికి నొకమారు తలకెక్కి ♦ మతపుఁబిచ్చి
యెట్టి పనినైనఁ బొనరించు ♦ నీశునాన
మానవుని వల్లఁగా దామె ♦ మనసుఁ ద్రిప్ప. ౭౨

ఉ. కావున నేయుపాయమును ♦ గైకొని యైనను మంచిమాట లే
వో! వినిపించి మావలకు ♦ నొప్పగ నామెను ద్రిప్పుటొప్పు, లే
దా విడిపోవు మాపనులు ♦ తప్పదు గావున నీమెచేతనే
పావడిఁగూర్తు ద్రానిదుల ♦ కంచును నారదమౌని యంతటన్.

ఉ. పున్నమరేయి యాశ్రమము ♦ పొంతను మెల్లఁగ సన్నగాలి పే
రెన్నిన సన్నజాజిపొద ♦ రిండ్లపయిం బడి వీచుచుండఁగా.
గిన్నరసాని యెల్గుఁగొని ♦ కిన్నెర వల్కఁగ సన్నగొంతుతో
విన్ననువొప్పఁ బాట విని ♦ పింపఁ దొడంగె మనోహరంబుగా.

చం. పతియెడఁబాటుచేఁ గలుగు ♦ బాధ విరోధిగృహప్రవాస దు
ర్గతి కలగింప నేమియెఱుఁ ♦ గంగని చిత్తముతోడ నాపతి
వ్రత వినుచుండె నారదుని ♦ పాటల నేమరి మెల్లమెల్లఁగా
మతి చెడిపోయె నొక్కగతి ♦ మ్రాన్పడిపోవఁగ జిప్పపాటుతో.

సీ. ఇదె! మంచిపాట పా ♦ డుదు నంచుఁ జెప్పి య
ష్టాక్షరీమంత్రంబు ♦ నాలపించు

ఇదె! గొప్పకథయంచు ♦ నింపుగా సొంపుగా
వైష్ణవగాథలన్ ♦ వరుసఁబెట్టు
ఇదె! మేలుసుద్ది చె♦ప్పెద నంచు మురువుతో
నార్యరాజచరిత్ర ♦ సుట్టు పాడు
ఇదె! లెస్స బుద్ధి వ♦ల్కెద నంచుఁ బ్రావడ్డ
ద్రావిడాచారముల్ ♦ తడవుచుండు

గీ. కన్ను మూఁతలు పడుచున్న ♦ కాంత యపుడు
వినెనొ! వినలేదొ! రవ్వంత ♦ వీని నెల్ల
నారదుఁడుమాత్ర మట్టి చిన్నగవుతోడఁ
జెలఁగి పాడుచుండెను గొంతు ♦ చిరుగునట్లు. ౪౩

గీ. విష్ణుకథలఁ జెప్ప ♦ వినరాదు నేనంచుఁ
జెప్పలేకపోమెఁ ♦ జెలియ యపుడు
సంయమీంద్రుఁ డద్ది ♦ చక్కఁగాఁ గనిపెట్టి
విష్ణుకథల నెల్ల ♦ విప్పి చెప్పె. ౪౪

గీ. వినఁగ వినఁగ భక్తి ♦ విప్పారఁజొచ్చెను
దెలియకుండ నుంత ♦ చెలియ కపుడు
కడకు నేమి కలదు? ♦ గర్భస్థపిండంబు
మార్పుఁ జెందెఁ దల్లి ♦ మార్పుతోడ. ౪౫

కం. తలకెక్కుచుండఁ గ్రమముగఁ
గలవాణికి మాని బూట♦కపునుడువులు వ్యా
కులపా టుడిగి కుతుకమునఁ
గలఁగక యందుండె బేల ♦ గావున నటుపై. ౪౬

కం. శుభలగ్నంబున నొక రే
శుభలక్షణలక్షితుండు ♦ సూనుం డొకఁడున్

బ్రభవించెఁగదా ద్రవిడ
ప్రభావహారుం డగుచును ♦ బ్రహ్లాదుఁ డనన్. ౭౦

చం. నవనవలాడుచుం జెటిగి ♦ నత్తినుడుల్ తడబాటు నెన్నడల్
జవజవలాడు మైమెఱుఁగు ♦ చక్కని చామనిచాయమేనితో
గవగవలాడుచుండ నెస♦కమ్మున నెంతయుఁ గన్నతల్లి తా
నవిరళమోద మంది తన♦యా! యిటు రమ్మని పిల్చుచుండెడిన్.

ఉ. నారదమౌనిశేఖరుఁడు ♦ నమ్మిక మొప్పఁగఁ గన్నతల్లికిన్
సారెకుఁ జేరఁదీసి యుప♦చారముఁ జేయుచు విష్ణునామముల్
నేరుపసాఁగె బిడ్డ కవ♦లీలను దల్లి యెఱుంగకుండ వి
స్తారపువాలకంబునను ♦ దన్నొరు లెవ్వరు చూడకుండఁగన్.

సీ. ఆరముగ్గిన పండ్లు ♦ నారగింతువు రార
చెట్టుచాటున కంచుఁ ♦ జేర్చుచుండు
మంచిమొల్లలు తెచ్చి ♦ మాల గుత్తువ యంచుఁ
బొదరిండ్లదరికిఁ గొం♦పోవుచుండు
లేఁడిపిల్లలఁ బట్టి ♦ యాడింతువా యంచు
దూరదూరమునకుఁ ♦ జీరుచుండు
రంగుపుల్గులఁ జూచి ♦ పొంగిపోదువె యంచుఁ
గాపుకొమ్మలఁ బట్టి ♦ చూపుచుండు

గీ. నారదుండు ప్రహ్లాదునిఁ ♦ జేరి యిట్లు
తంత్రములఁ బన్నసాఁగె ను♦ద్దండుఁ డగుచుఁ
గాన నుండుటచే నొరుల్ ♦ గానకుండఁ
గడకు లీలావతీదేవి ♦ కన్నుఁ బ్రామి. ౭౩

సీ. శివలింగధారణఁ ♦ జేయవే యని తల్లి
బతిమాల మూఁగయై ♦ పల్కకుండు

శివదేవునకు మ్రొక్కఁ ♦ జెల్లింపవే యన్న
"ఊఁఊఁ"యటంచుఁ దా ♦ నొదిగియుండు
శివదేవు మంత్రంబుఁ ♦ జెప్పవే యన్నచోఁ
జేరత్రి విష్ణునిఁ ♦ బిల్చుచుండు
నినుఁబట్టి కొట్టింతు ♦ నేనని వచియింప
నత్తదే యనిచెప్పి ♦ యూరకుండు

గీ. ప్రబ్బికోలు మొండితనమ్ము ♦ ప్రల్లదనముఁ
జూపుచున్న ప్రహ్లాదునిఁ ♦ జూచి తల్లి
మొగము చిట్లించుకొనలేదు ♦ మొదటికొన్న
గానఁ గనుబొమ్మ ముడివైవఁ ♦ గడఁగలేదు. ౨౪

గీ. ఎన్ని పేరు లుండ ♦ వీశున కాతఁ డే
పేరఁ బిలుచుచున్న ♦ వినకయున్నె ?
పేరులోన నేమి ♦ పెన్నిధి కలదంచుఁ
దిట్టఁబోక సమ్మ♦తించెఁ దల్లి. ౨౫

కం. నారదుఁ డిది యంతయుఁ గ
న్నారఁగ లక్షించి మోద ♦ మందుచు నుండెన్
దారుణముగఁ జెఱయింటను
బోరను దాకొల్పినాఁడఁ ♦ బో పొమ్మనుచున్. ౨౬

కం. ఈగతి నైదేం డ్లగన్
వాగీశు ననుగ్రహంబు ♦ వలన వరంబుల్
దాఁ గొని హిరణ్యకశిపుఁడు
దూఁగాడుచు నడిచిపాటు♦తోఁ జొరి నగరున్. ౨౭

ఉ. పచ్చము పొడునుం దెలిసి ♦ బగ్గున మండి కషాయతాత్ముఁడై
యచ్చెరు వయ్యె దైవగతి ♦ యా మగబీరములేని పంద నే

నిచ్చట లేనటం చెఱంగి యేమిమొగంబున మందిరంబులోఁ
జొచ్చి మదీయసాధ్వి నెది చూచుక ముందలఁ బట్టియీడ్చెనో

గీ. ద్రవిడరాజసింహంబు పరాభవంబు
నకట సహియింపనోప దేనైనఁ గాని
మగలరాజౌట నా దండిమగనిఁ బట్టి
తెత్తు మగనాంధ్రు చూడఁగ న్నెత్తి వాని. ౮

వ. అనుచు నవమానరోషంబునఁ గ్రుద్ధుండై కాల నేలం దన్ని

కం. తలచీరఁ జుట్టి చేతన్
దలతలమను కత్తిఁ బట్టి తటుకున సైన్యం
బుల నగరంబుననె నిలిపి
కలకల మాపుచు హిరణ్యకశిపుం డంతన్. ౯

చం. కతిపయసాదులం గొని యఖండజవంబున నారదాశ్రమ
ప్రతిసరభూమిఁ జేరి యతివర్యుని నారదుఁ గాంచి వందనఁ
బతిశయభక్తిఁ జేసి రయమారఁ గుటీరముఁ జొచ్చి వెంట?
కుతుకముతోడ నందు సుమకోమలిఁ జూచి సరాగచిత్తుఁడై. ౧౦

కం. అవలేపముతో నింద్రుం
డవకాశముఁ జూచికొనుచు నవరోధము లే
కవరోధము దూరి యిటుల
నవమానముఁ జేసె సాధ్వి హంతవ్యుఁ డగుఁగా. ౧౧

ఉ. చూడుము మాహాహేహా పరిశోషణఁ జేసెద స్వర్గధామముఁ
జూడుము మాహాహేహా కడుఁ జూడెద భీకరశత్రుసైన్యముఁ
జూడుము దేవి! నాబలముసొంపు విరోధి బలంబుపెంపు నే
నూడనిబాడఁ జేసెద బిడౌజుని నాకులఁబాడు చేసెదన్. ౧౨

వ. హిరణ్యకశిపుం డిటు దేవేరితోఁ బరీభావంబు నీఁగు కార్యక్రమంబు నివేదించుచుండ. ౯౪

కం. చిడిముడిపడు చడుగడుగునఁ
దడబడుచుఁ గొణిఁగికొనుచుఁ ♦ దండఉపడుచున్
మిడిసిపడుచుఁ బ్రహ్లాదుఁడు
వడివడి నడతెంచి తల్లి♦వంకకు నడువన్. ౯౫

వ. హిరణ్యకశిపుం డానందాశ్రులు చిందుచుండఁ బరవశుండై బాలకు గ్రుచ్చియెత్తి ముద్దాడుచుఁ, జుబుకంబుఁ బుణుకుచుఁ దడబడు నడలు, బుడిబుడినుడులు, మంటిబ్రుంగిన యొడలు, మురిపెంబు గడలుకొలుప, ౯౬

గీ. పుత్రగాత్ర పరిష్వంగ♦భూరిసుఖము
నందు నోలాడి మఱుపుతో ♦ నట్టె నిలిచి
కడకుఁ బ్రియురాలితోఁ దన ♦ కొడుకుతోడ
వెంటనే పయనం బయి ♦ వీడు చొచ్చి. ౯౭

వ. జైత్రయాత్ర చాటించి, ప్రస్థానభేరి వేయించి, మహాసైన్యంబుతోఁ ద్రివిష్టపంబుపై దాడివెడలి, తన్నగరంబు వలఁజుట్టియున్న, మిత్రుపల్లంబులకుఁ దొలంగి, సమప్రదేశంబున దండు విడియించి, కోటకు లగ్గలువట్టి, యత్యల్పకాలంబున సాధించి, పలువురు చూచుచుండ, శచీదేవి కట్టెదుట నింద్రునిఁ జెఱఁబట్టి దక్షిణాపథంబునకుం గొనితెచ్చి వెట్టిపనియందు నియోగించి, యతని మొత్తుకోళ్ళతోఁ బాటు లీలావతీదేవి వేడుకోళ్ళు కరుణార్ద్రచిత్తుఁడై యంగీకరించి, విడిచిపుచ్చి. ౯౮

గీ. అఖిల దిగ్దేశవిజగీషుఁ ♦ డై హిరణ్య
కశిపుఁ డైదారుగాదులు ♦ కడపిపుచ్చి

పిదప నుడుకు చల్లారఁగా ♦ విశ్వమెల్లఁ
జక్క లెడఁబాపి రాజ్యంబుఁ ♦ జేయుచుండి. ౧౦౦

వ. ఒక్కనాఁడు రాకుమారుని విషయమై యోజించి, బాలుని విద్యాప్రసంగమున సంస్కరించుట యుత్తమంబని నిశ్చయించి.

గీ. పూర్ణముగ నీతిశాస్త్రంబు ♦ బోధపడదు
ప్రౌఢమంత్రాంగ మెఱుఁగంగ ♦ వలనుపడదు
రాకొమరుఁడు చదువకుండ ♦ రాదు గానఁ
జదువు నేర్పింతుఁ గొలపుటో ♦ జ్జకడ నంచు. ౧౦౨

మ. పదియేనేఁడులు చెల్లిపోయిన సరే ♦ వాకాటులం జిక్కి చో
క్కి దివారాత్రములట్టి బాలకుఁ డహో ♦ క్రీడించుచున్నాఁ డదే
చదువుల్ నేర్పినఁగాని పోవదు మనో ♦ జాడ్యంబు కాఁబట్టి నేఁ
జదివింపించెదఁ బెద్దయోజ్జలకడన్ ♦ శాస్త్రంబు లన్నింటినిన్.

వ. అంచు విచారించి, సకలనీతిశాస్త్ర పారంగతులును, గులాచార్యులును, నైన శుక్రాచార్యతనూజు లగు, చండామార్కుల రావించి, కార్యవిషయంబు ముచ్చటించి రాకుమారుని వారల కప్పగించి, పండితోత్తముం జేసి తోడ్కొని రండని యానతీయ. ౧౦౪

సీ. మూఁడేండ్లు పోవక ♦ మున్నె శుక్రాచార్య
పట్టి ప్రహ్లాదునిం ♦ బట్టి తెచ్చి
ద్రవిడరాజేంద్రు ముం ♦ దరఁ బెట్టి దీనుఁడై
యితఁ డెట్టిబిడ్డఁడో ♦ యెఱుఁగరాదు
గురుభక్తి గనరాదు ♦ సరకు సేయుట లేదు
శిక్షింతుమన్నఁ దాఁ ♦ జెడ్డకోతి
వనమెల్లను జెఱచు ♦ ననెడి నానుడిరీతిఁ
దోడిబాలురఁ దప్పు ♦ ద్రోవఁ బెట్టి

గీ. అకట! కులదైవమును దూల♦నాడఁ జొచ్చె
శివునికథలెల్లఁ జెడచెవిఁ ♦ జేర్పఁజొచ్చె
బాలునకు శిక్ష చెప్ప మా♦వల్లఁ గాదు
చతురమతి నీవె యెట్లైన సాఁకికొనుము. ౧౦౫

గీ. ఎన్ని చెప్పినఁ దలయూఁచఁ ♦ డింతయేని
మాఱు పలుకక తనపని ♦ మాత్ర మట్టె
పట్టుఁదలఁ జేయు నిది యేమి ♦ పాపమయ్యొ?
మూఁగవానిని బోధింపఁ ♦ బూను టయ్యొ. ౧౦౬

కం. చదివింపఁగ దొరకొంటిమి
చదివించిన లాభమేమి ♦ సమకూడెనొకో!
చదివినయర్థం బెఱుఁగఁడు
చదివింపఁగలేము మేము ♦ క్ష్మావర! వీనిన్. ౧౦౭

క. చిరకాలార్జిత విద్యను
బరమార్థముతోడఁ జెప్పఁ ♦ బఠియింపకయే
మఱుకువతో నుండును భూ
వర వీనిని సాఁకలేము ♦ పాలసుఁ డగుటన్. ౧౦౮

గీ. ద్రవిడజాతి కీతఁడు గుండె ♦ తల్లడంబు
విమల రాజవంశమునకు ♦ వేరునిత్తు
దేవ! దీని నెల్ల నెఱింగి ♦ దిద్దికొనుము
నీదు తొలికాన్పుబిడ్డను ♦ నేర్పుతోడ. ౧౦౯

ఉ. కావున నీకుమారకుని ♦ గ్రన్ననఁ దెచ్చితి మప్పగింపఁగా
భూవర! యింకమీఁద సరి♦పోయినరీతిని దిద్దికొమ్ము, మీ
పావనమైన వంగడపుఁ ♦ బర్వఁ బ్రతిష్ఠను బాఱఁజూచి లో
కావనదీక్ష నేకరణి ♦ నైన స్వధర్మము నిర్వహింపుమా. ౧౧౦

వ. అంచు వచియించి, చండామార్కులు హిరణ్యకశిపునకు
వుం గఱపి, సెలవుం గైకొని, మగిడి పోవ, రాక్షసేశ్వరు
చింతాక్రాంతచిత్తుండై.

గీ. నయము భయ మనయము ♦ నయముగా బోధింప
మచ్చరంబు హెచ్చు ♦ మానఁ డయ్యొ
మొండిపట్టుఁ బట్టె ♦ దండనంబునఁ గాని
సాధ్యపడఁ డటంచు ♦ సాహసించి.

ఉ. వాదన లేటికంచు బల♦వంతుఁడు తేఁడు కృపం ద్యజించు
గాదిలిపట్టి యంచుఁ గడ♦కంటను జూడక నిష్ఠురక్రియా
పాదనచేత శిక్షఁ బరి♦పాటి విధింపఁగఁ జీలిపోయెఁ బ్ర
హ్లాదకుమారమాతులబ♦లంబు చలంబున రెండుపాయలై.

గీ. రాచనగరెల్ల నిట్టి దు♦ర్వార్త వినుచు
నట్టుడికినట్లు తుకతుక♦లాడిపోయె
నార్య లియ్యది కనిపెట్టి యూర వంచి
తరుణ మాసన్నమయ్యె నీ♦సరణి ననుచు.

గీ. నీతికోవిదుల్ గుమిగూడి ♦ నిక్క మెఱిఁగి
దైవగతిచేత గృహములోఁ ♦ దారసిలిన
భేదభావంబు నెట్టులైన ♦ విస్తరింపఁ
జేయ సమకట్టి నారదుఁ ♦ జీరి చెప్ప.

వ. మహేంద్రుని చెఱ విడిపించి తొల్లి లీలావతీదేవిని దన
మంబున నుంచికొని యుపచారములు చేసి సంతోషపెట్టి
నా మానవతీమతల్లి తనయెడ కనికరించి నిరాటంకముగా
పురమునకు రాకపోకల కనుమతించిన స్నేహంబుఁ బు
రించుకొని కార్యోన్ముఖుం డయి.

ఉ. నారదుఁ డొక్కనాఁడు నర◆నాథకుమారకుఁ జూడవచ్చి దై
వారెడిప్రేమఁ గన్బఱచి ◆ యక్కఱమాటలు నాల్గు చెప్పి వే
యారులు కొండెముల్ పలికి◆యాననిపించి సుతార మొప్పఁగా
దూరని తోపకుండ మది ◆ దూరిన మెత్తని గొట్టుమాటలన్.

ఉ. నీ జనకుండు గర్వమున ◆ నిర్జరకోటిని సాధుసాళి రా
రాజునటంచు నుబ్బుచుఁ బ◆రాక్రమలీలఁ గ్రమంబుఁ దప్పి పే
రోజముఁ దూల్చుచుండ నిటు ◆ లొప్పరికించుట రాజనీతియే?
రాజులు లేరె? మున్నిటు ల ◆ రాజకముం బొనరించినారలే?

ఉ. యాగము ముక్తినిచ్చునను ◆ నాశ మెయిం గడు శ్రద్ధతోడ నా
యాగమవేత్త లందఱు ప్ర◆యాసముతో నొనరించుచుండఁగా
యాగము ముక్తినిచ్చునె య◆థార్థముగా? నని పాడుచేయు నీ
యాగమునాగడంబు తగు◆నా యొడయుండగువానికెందునున్?

కం. బాలుఁడ నే ననఁబోకుము
బాలకునకుమాత్ర ధర్మ◆పద్ధతి వలదా?
బాలుఁడె ధర్మము నిలుపం
జాలిన దైవంబు మెచ్చి ◆ సంతసపడఁడా? ౧౨౦

కం. నే నెటు లీపనిఁ జేసెదఁ
బోనిమ్మని నీవు చెప్పఁ◆బోకుము బాబూ!
వేనకువే లున్నారు మ
హానాయకు లిపుడు నీకు ◆ నండఁగ నిల్వన్. ౧౨౧

ఉ. తర్కవితర్కముల్ వదలి ◆ తండ్రి పురోహితదండనాథసం
పర్కముచే మహాకఠిన◆భావముఁ దాలిచి యొక్కతీరుగాఁ
గర్కశుఁడయ్యె దానఁ బ్రజ◆కష్టములొందెడుఁ గావునన్ శుభో
దర్కముగాఁగఁ జక్కఁబడు◆ దారిని బోవుట పాడి పుత్రకా!

వ. ఇంతియ కాక. ౧౨౨

ఉ. దేవరహస్య మొండు విను ♦ తెల్పెద స్వప్నమునందు సర్వలో
కావనదీక్షితుండు చతు♦రాగమవేద్యుఁడు నాకుఁ దోఁచి నే
నీవఱ కూరకుంటి నిటు ♦ లే నిఁక నైఁప మదీయభక్తునిన్
బావను నిష్కురంబయిన ♦ బాధలు పెట్టుచు నుండ నెవ్వఁడో.

ఉ. కంటకుఁడై ధరావరుఁడు ♦ కారియ పెట్టిన యప్పుడే సభా
మంటపమందు నున్న యతి♦సూత్రపుస్తంభమునందు డాఁగి త
న్నంటిన వెంటనే యతని ♦ యాయువుఁ దీసెద నాదుభక్తు నే
నొంటరిఁ జేసి పోవ నెటు ♦ లూరట గల్గునటంచు నాకెఁగా.

ఉ. కత్తులు నూరినంతటనె ♦ కంపము నొందరు ధీరు లెందుఁ గిం
చిత్తయినం బ్రమాదపడి ♦ సేయ రధర్మము గాన దీని యా
పత్తెఱిఁగించినాఁడ భగ♦వంతుని యిష్టముఁ దెల్పినాఁడ నీ
చిత్తము; ధర్మపాలనము ♦ శిష్టసమీహితకార్య మౌఁగదా.

ఉ. రక్షకుఁడొక్కఁడేనియును ♦ రాష్ట్రమునం గనరామి నీప్రజల్
రూక్షభయంబునన్ గలఁగి ♦ రోజొక యేడుగ నున్నవారు నీ
కక్షయసంపదల్ గలుగు ♦ నయ్య ధ్రువంబుగ నార్తులౌ ప్రజా
పక్షముఁబూని పోరునెడ ♦ బాగని దైవము మెచ్చుఁ బుత్రకా!

వ. ఈగతి నపూర్వరాజనీతి ప్రకారంబు మెఱయ, నారదుండు బోధించి, యలౌకికుం డయిన ప్రహ్లాదునిచే వల్లె యనిపించుకొని నూటిగా విశ్వకర్మమందిరంబుఁ బ్రవేశించి, యొగ్గతంబున మంతనం బాడి నేర్పరులగు పెక్కుర శిల్పుల సమకూర్చి వారికి రహస్యంబుఁ దెల్ప వారును, ౧౨౭

చం. ఎవరికిఁగూడ శంక ఘటి ♦ యిల్లని నేర్పున మెల్పుతోడ రేఁ
బవ లనకుండ నారదుని ♦ పంకము నెగ్గెడుభాతి యుక్తిచేఁ
జివరకుఁ దత్సభాస్థలిని ♦ జిక్కనిచిక్కని మాటుతల్పులన్
గవిసిన యుక్కుకంబమును ♦ గట్టిరి శిల్పకళావిదగ్ధులై. ౧౨౯

ఉ. ఆఁకొనియున్న సింగము ర♦హస్యముగాఁ గని పట్టి తెచ్చి యే
పోకలు పోవనీక యొక ♦ బోనునఁ బెట్టి యుపాయశాలురై
కైకొని దాని మండపపుఁ ♦ గంబమునం దిరికించి పెట్టి తా
మై కనిపెట్టియుండిరెటు ♦ లౌనొకదా! యని యార్యమాంత్రికుల్.

వ. మఱునాఁడు హిరణ్యకశిపుం డాగ్రహోదగ్రుండై సభా
ముఖంబున గద్దెపైఁ గూర్చుండి, గద్దించుచు "విష్ణుండు,
విష్ణుం"డని నిరంతరంబు, వానిఁదలచి, ప్రలపించుచుంటివి.
ఆతండెక్కడ యదృశ్యుండయియడంగియుండెనో చూపింతువా"
యనఁ బ్రహ్లాదుండు వికసితముఖుండై నిర్భయముగా "ఇదిగో!
నీసభామంటపస్తంభంబుననుండె. చూడనిచ్ఛగింతువేని చూడవే"
యనవుడు సార్వభౌముండు మండిపడి తోకఁ ద్రొక్కిన మహా
నాగంబుకైవడి రోజుచు, గదను బిరబిర సారించుచు గద్దెనుండి
దుమికి, సాకం బెఱుఁగక స్తంభంబున కేసి, యెదురు నడచి
బ్రహ్మాండంబు బూరటిల్ల సింహనాదంబు జేసి దాసి యయో
మయంబగు దీర్ఘగదాదండంబు గిరగిరఁ ద్రిప్పి పెల్లు మని
స్తంభంబు విఱిగి కూల విసరికొట్టెను. కొట్టిన మఱుక్షణంబుననే
యదృశ్యంబులగు మఱితల్పులం బడఁద్రోసికొని, ౧౩౧

కం. గర్జించుచుఁ బంచాస్యము
నిర్జరరిపుపైకి దుమికి ♦ నీరవునింగా
జర్జరితాంగుని జేసెను
ధూర్జటిభక్తునకు నేమి ♦ తోఁచకమున్నే. ౧౩౨

కం. అంగద నవయుచుఁ జెంగున
సింగము చెలరేఁగి గోళ్ళఁ ♦ జీల్చుచు నతనిన్
గంగారుగఁ జేసి పిదప
నంగిడి పుట్టించి వేగ ♦ నసు రెడఁబాపెన్. ౧౩౩

ఉ. కొండలు పిండిపిండిగను ♦ గొట్టెడి మేల్పడవాలుదంట కుం
భాండుఁడు హుంకరించి జ్వల♦దాతతశాతకృపాణహస్తుఁడై
గండడగించి సింహమును ♦ గాలుని ప్రోలికిఁ బంపె వెంటనే
దుండగులెల్ల మ్రానుపడి♦దూరఁగఁ దొంపర సందుగొందులన్.

కం. పాతరలాడెను నారదుఁ
డాతరి నుప్పొంగిపోయి ♦ యనుకొన్న పనిన్
జాతురితోఁ దీర్చితి నని
చేతం దెగమెఱయుచుండఁ ♦ జిటితాళంబుల్. ౧౩౫

గీ. అన్నదమ్ము లిర్వురను సిం♦హంబుచేత
నేదుపందిచేఁ గూల్పించి ♦ యెగిరిపడుచు
మోదమందె నార్యజనస♦మూహ మెల్ల
నెల్లభూములఁ దమయాజ్ఞ ♦ చెల్లుననుచు. ౧౩౬

ఉ. ద్రావిడరాజ్య మంతయును ♦ దక్కొనఁ జేసిన తక్షణంబునన్
ద్రావిడులెల్లఁ బోరెదరు ♦ ప్రాణముపైఁ గల తీపి మాని రా
జ్యావనదీక్షఁ బూని సమ♦రాంగణ మెల్లను బీన్గుపెంటలై
పోవఁగఁ గాన నిప్పు డిది ♦ పోలదటంచు మునీంద్రుఁడంతటన్.

గీ. రాజనీతివిరుద్ధమై ♦ ప్రాణహానిఁ
జేయు నీకార్య మరయ ని♦షిద్ధమంచు
నార్యులకుఁ జెప్పి యొప్పించి ♦ యవలఁ గార్య
చతురుఁడై దూరదృష్టిచే ♦ సకల మెఱిఁగి. ౧౩౮

గీ. కీలుబొమ్మ నొండు ♦ కీలకమ్మున గద్దె
మీఁద నుంచు నెడల ♦ మీఁద మేలు;
ఎల్ల లేని నేల ♦ యెల్ల నీతని పేర
నేలవచ్చు పలుక ♦ నేల యనుచు. ౧౩౯

శా. జాతిద్రోహునిఁ దాతమారకుని వం♦శభ్రష్టుఁ బ్రహ్లాదునిన్
జేతోమోదముతోడ నార్యజనముల్ ♦ సింహాసనారూఢునిం
బ్రాతిం జేసిరి తక్షణంబ ద్రవిడ♦వ్రాతంబు నిర్విణ్ణులై
కాతర్యంబున నేమితోఁచకయె ది♦గ్భ్రాంతాత్ములై దాఁగఁగన్.

గీ. అతిమతావేశకలనచే ♦ నాదమఱచి
గురువులకు లోఁగి మతిచెడి ♦ కులముఁ జెఱచి
వంశనాశంబుఁ జేసిరి ♦ పాపమునకు
తల్లిబిడ్డ లొక్కటయి పెం♦పెల్లఁ బోవ. ౧౪౧

గీ. ఆకలంబు సాపడు మాని ♦ యైన నేమి ?
యాకులంబుఁ జెందినవాని ♦ నందఁ జెందు
నేకలం బీశ్వరునిఁ జేసె ♦ నేకలంబు
నాకలంబునకు జోహారు ♦ లనకయున్న. ౧౪౨

సంపూర్ణము.



# యథార్థ రామాయణము.

కం. శ్రీరామాయణకృతిలో
మీ రెఱుఁగని భావమొండు ♦ మిసుకునె? కానన్
గారుణికోత్తమ! చెప్పఁడీ
శ్రీరామాయణమునఁ గల ♦ చిత్రము లెల్లన్. ౧౪౩

ఉ. మార్తుర పేరులం దలలు ♦ మాఱిచియున్ దలక్రిందుచేసియున్
నేర్తునటంచు గర్వమున ♦ నిక్కి ప్రచేతసుతుండు తెంపునన్
బూర్తిగ రామచంద్రకథ ♦ మున్ రచియించెనటంచు బాపురే!
వార్త యొకండు నేఁడు విన♦వచ్చెడి సత్య మెఱుంగఁబల్కవే

కం అనినంతనె సూతమహా
మునిచంద్రుఁడు పల్కెఁ బ్రేమ♦మున నిట్లనుచున్
వెనుకటి గాథలఁ జ్ఞప్తికిఁ
గొనితెచ్చికొనుచు మనంబు ♦ కుతుకముఁ జెందన్. ౧౪

కం. బిడ్డా! నీసంప్రశ్నము
దొడ్డది; యఖిలంబు చెప్పు♦దున్ విను మిపుడే
చెడ్డయొ మంచియొ తెలిసిన
గడ్డువిశేషంబు లెల్లఁ ♦ గాదనకుండన్. ౧౪

ఉ. పేరులు మార్చినాఁడు తల♦పెట్టి దురర్థము రాఁగఁ గొన్నిటిన్
బేరులు మార్చినాఁడు తల♦పెట్టి యపార్థము రాఁగఁ గొన్నిటి
బేరులు మార్చి మాఱుతుర ♦ పేరు ప్రతిష్ఠను బాడుచేయుచున్
బేరు గడించె నాదికవి ♦ పేరు షాగత్తు జగంబు నిండఁగన్.

సీ. "దసగీవ" యనెడి శ♦బ్దము దశగ్రీవఁ గా
నించి గొంతులు బంతి ♦ పెట్టినాఁడు.

"రావన్న" యనుపేరు ♦ రావణగాఁ జేసి
బొబ్బమానిసి చేసి ♦ పోయినాఁడు
"చుప్పనాక "ను దెచ్చి ♦ శూర్పణఖం జేసి
చేటగోరులదానిఁ ♦ జేసినాఁడు
"రక్కసి" యనుమాట ♦ రక్షస్సుగాఁ జేసి
యేమేమొ యర్థముల్ ♦ వ్రాసినాఁడు

గీ. లోకసామాన్యకవియె వా♦ల్మీకిమౌని ?
తలలు తెగమార్చినట్టి ప♦దాల నెల్ల
వేఱె యొకనాఁడు చెప్పెద ♦ విస్తరించి
నేఁడు రామాయణాంశముల్ ♦ నీకు వినుతు.

## లంకాపుర వర్ణనము.

సీ. మూఁడుకాలములందుఁ ♦ బూచి నెత్తావులం
బొలమెల్ల నిరఁజిమ్ము ♦ పూలచెట్లు,
ఆకాల మీకాల ♦ మేకాల మనకుండఁ
బగటిల్లి తెగకాయు ♦ పండ్లచెట్లు
మిద్దెమేడలకొట్టె ♦ నిద్దంపు సొబుగారు
ముద్దుకల్ప నొసంగు ♦ మద్దిచెట్లు
పశుపక్షి మృగకీట ♦ వర్గంబునకు నెండ
నిలువ నీడ నొసంగు ♦ నిడుదచెట్లు

గీ. తీగగుంపు, గాటంబుగాఁ ♦ గౌఁగిలింప
మిగుల రమణీయమై చూపు♦మేరవఱకు
వేఁగువేఁగుగాఁ గన్పట్టు ♦ విపినభూమి
యిమ్ముకొని యుండు ద్రవిడదే♦శమ్మునందు. ౧౪౭

ఉ. ఓదములన్న లెక్కగొన ♦ కుండ మదంబున గుంపుగుంపులై
గాదము సేయుచున్ బసరుఁ♦గ్రక్కెడి పచ్చని యాకుకొమ్మలన్
బోదెలఁబట్టి తొండముల ♦ బోరలగల్చుచు బృంహితంబులన్
వాదములాడుచుం దిరుగు ♦ వన్యమదేభ సమూహ మచ్చటన్.

చం. పిడికెడు విత్తనంబులను ♦ విత్తినమాత్రన మూఁడుకారులన్
గడుపున చిచ్చుఁబుచ్చుఁగల ♦ కమ్మని మేలిమి పంటపైరులన్
పుడుకులనిచ్చి భూప్రజను ♦ బోషణఁ జేయుచునుండు నెప్పుడీ
పుడమిని దక్షిణాపథముఁ ♦ బోలెడిదేశము వేఱెయున్నదే! ౧౫౧

చం. బుధజనవాసయోగ్యమయి ♦ పుణ్యనదీనదవారిసేవ్యమై
మధురఫలప్రసూన తరు ♦ మండలమండిత దివ్యభాగ్యమై
పృథుతర దివ్యభోగ్యమయి ♦ వెల్గెడి పూతచరిత్రదక్షిణా
పథమును నంటి దక్షిణపు ♦ వైపున దక్షిణవార్ధియొప్పెడిన్.

గీ. నారికేళావనీరుడ్వ ♦ నంబులందుఁ
గాపురము సేయుచుండు ర ♦ క్కెడి జనంబు
పరమ సంతుష్టులగుచు నొం ♦ టరము లేక
పరుల యధికార మెట్టిదో ♦ యెఱుఁగఁబోక. ౧౫౩

చం. అఱవము, జానుతెల్గు, మల♦యాళము, కన్నడబాస, కోయ, చెం
దెఱుకులగొందు బాసలకు ♦ నెల్లను దొల్లిటిదైన బాసనున్
నెఱిపడి మాటలాడెదరు ♦ నీతిదొఱంగక సంచరింపుచున్
బిరుసున మానరక్షణకుఁ ♦ బిక్కక ప్రాణము పూటవెట్టుచున్.

ఉ. కో యని యార్చిచూడు మిది♦గో! యని కొండఘుకీనుకత్తితోఁ
యఁ బ్రతీపకంఠములఁ ♦ గోంకరు జంకరు మానరక్షకై
యలు చెంచులున్ దులువ♦కోటులకోటులుపోటుమానిసుల్
గాయరు జన్మభూమిఁ దెగ ♦ వైచెద రన్యులు కాలువెట్టినన్.

గీ॥ అంకపడి దక్షిణాంబుధి ♦ యంకమందు
లంక, శివలెంక, ప్రతిభాంక ♦ లంక వెల్గు
నిత్యనిష్పంక, నిశ్శంక ♦ నిష్కళంక
వంక గానరా దావంక ♦ వంకవంక. ౧౫౬

గీ॥ తొలుత సాలకటంకట ♦ కులజులైన
మాల్యవంతుండు మాలి సు ♦ మాలిమొదలు
గాఁ గలుగువారు లంకలోఁ ♦ గాపురంబు
సలిపి రాజ్యమేలిరి కత్తి ♦ బలిమిచేత. ౧౫౭

వ. నిరంతరపరాజయసంభవావమానంబుచేఁ గుమిలి కుమిలి, నిద్వేషులెల్ల రొక్కటయి, దండెత్తివచ్చి మాలింజంప మాల్యవంతుండును సుమాలియు లంకను బాడువెట్టి రసాతలంబునకుం బలాయితులైరి. ౧౫౮

గీ. పాడువారిన లంకను ♦ బాడుగుడిపి
జక్కు లందుండ వారలఁ ♦ జావమోది
వెడల నడచిరి కోయలు ♦ జడుపునుడిగి
వశముఁ గానించుకొని బాహు ♦ బలముచేత. ౧౫౯

గీ. కొంచె మించుమించుగ నాలు ♦ గువయిపులను
నతివిశాలం బగాధంబు ♦ నైన కడలి
యతికి యుండుటచే నారు ♦ ఋతువులందు
వాసయోగ్యంబు లంక యె ♦ వ్వారికైన. ౧౬౦

గీ. నిడుదమలమీఁద వాటంపు ♦ నెత్తమందు
గట్టిగా మూఁడుకొమ్మల ♦ నట్టనడుమ
దుర్గమంబుగాఁ గట్టిరి ♦ దుర్గమొండు
కాసె పనిఁగన్న లోకంబు ♦ కన్నుఁగుట్ట. ౧౬౧

సీ. అభ్రంకషోత్తుంగ ♦ హర్మ్యసౌధంబుల
పసిడికోచులు దెసల్ ♦ ప్రాకులాడ
గోపురప్రాకార ♦ కుడ్యరత్నద్యుతుల్
దూఁకి యొండొంటితోఁ ♦ ద్రోపులాడ
రథకేతనాంబర ♦ ప్రథిత కాంతిచ్ఛటల్
తెంపాఱి మింటిపైఁ ♦ దేలియాడ
శింజనీటంకార ♦ శృంగారి ఘీంకార
రావంబు లొండొంట ♦ రాపులాడ

గీ. బహుళ చతురంగ వాహినుల్ ♦ పగ్గెలాడ
మూఁడులోకంబులకు గుండె ♦ ముల్లువెలసె
మాట జవదాఁట నేరని ♦ పోటుమగల
కాపురంబైన రమ్యలం ♦ కాపురంబు. ౧౬-౨

ఉ. చల్లని పిల్లతెమ్మెరలు ♦ సాఁగుచుఁ గమ్మని పూవుతావిలో
మెల్లఁగఁ బొర్లిపొర్లి తమ ♦ మేనఁ బువుం బొడి మేదుకొంచు న
ల్లల్లన కుంటికుంటి నడ ♦ యాడుచు నుండఁగ మింటనుండి జా
బిల్లియుఁ గాయఁగాఁదఱపి ♦ వెన్నెల హాయిగ నుండు లంకలో

శా. లంకాపంకములెల్లఁ జేవదలి ♦ యత్యానంద నిర్మగ్నులై
శంకాతంకవిచారదూరులయి య ♦ శ్రాంతంబు నాఁటిట శ్రే
ణ్యంకుల్ వాసము చేయుచుందురుసమ ♦ స్తైశ్వర్యభోగాఢ్యులై
లంకారాజ్య మహావిభూతి గరిమన్ ♦ శ్లాఘింపఁగా శక్యమే

గీ. వెడఁద మొమ్ముగల్గి ♦ నిడుద చేతులుగల్గి
మాట యురువుగల్గి ♦ నీటుగల్గి
జిద్దు నేర్పుగల్గి ♦ చిట్టంటు లంకలో
మానటీఁడులైరి ♦ ♦ మనుజులెల్ల.

సీ. పదిదిక్కులను గెల్చి ♦ బహు జయస్తంభముల్
పాతిపెట్టించిన ♦ బల్లిదుండు
పదిశాస్త్రములుగట్టి ♦ పట్టుతోఁ బఠియించి
ప్రజ్ఞాధురీణుఁడౌ ♦ పండితుండు
పదునాల్గు లోకముల్ ♦ బవరాన నోడించి
కాలిక్రిందను బెట్టు ♦ కాలిబంటు
పదియారుకళలఁ బ్ర ♦ పంచంబుఁ దనియించు
శశిచెంపఁగొట్టిన ♦ సౌమ్యమూర్తి

గీ. కడుపులో చల్ల రవ్వంత ♦ కదలకుండ
ద్రవిడ జాత్యభిమాని య ♦ థార్థవాది
ప్రాజ్య రాజ్యమేలుచునుండె ♦ రావణుండు
దర్పితాహిత లోక వి ♦ ద్రావణుండు. ౧౬౬

సీ. పలుగాకి పులుగాకుఁ ♦ బొలిపుచ్చి తననాఁడు
చీకాకు పడకుండఁ ♦ జేసినాఁడు
గాటంబుగాఁ జెల ♦ గాటంబుగాఁ జెల
రేఁగి మార్తురఁ జీల్చి ♦ రేఁగినాఁడు
గోపురంబు పురంబు ♦ బాపురే! యన మూఁడు
కొండకొమ్ములమధ్యఁ ♦ గూర్చినాఁడు
కలిచేతఁదన్ని యా ♦ కలిమాన్పి గిలిమాన్పి
నలిమాన్పి యెల్లర ♦ నిలిపినాఁడు

గీ. కుదురునకుఁ బట్టుఁగొమ్మయై ♦ కుదిరినాఁడు
నాఁడు తనుఁగొల్వ నొనరించి ♦ నాఁడు నాఁడు
నదురులేని నాయకుఁడై ♦ నాఁడు నాఁడు
రావణుం డార్యలోక వి ♦ ద్రావణుండు. ౧౬

సీ. లంకాపురీంద్రమే ♦ లబ్ధవర్ణనకెంతొ
బడలార్చు బంగారు ♦ పడుకటిల్లు
దక్షిణాపథమే ని ♦ పక్ష పక్షాంతకు
నలరించు నసివారు ♦ నాఁకతోఁట
భారతఖండమే ♦ బాహాబలాఢ్యుల
సవరించి గడితేర్చు ♦ సాముగరిడి
ఖండాంతరంబులే ♦ గానకళావేది
కరియప్పనములిచ్చు ♦ నట్టిపాలము

గీ. ద్రావిడావళి కెవ్వాఁడు ♦ జీవగఱ్ఱ
యతఁడు వీరశైవుండు మ ♦ హాభిమాని
రావణుండు విద్రావిత్రై ♦ రావణుండు
గోనబు జాళువా గద్దెపైఁ ♦ గొలువుఁదీర్చు. ౧౬౮

గీ. కోయవారల నాగరి ♦ కుల నొనర్చి
చదువు సాములఁ జెప్పించి ♦ చక్కఁబఱచి
యాభిజాత్యభావోదయ ♦ మ్మలవరించె
నవుర! రావణుం డెంత ధ ♦ న్యాత్ముఁడగును. ౧౬౯

గీ. "అన్నమో రామచంద్రా" య ♦ టంచు నేడ్చు
వా రయోధ్యలోఁ బెక్కురు ♦ న్నారుకాని
"యన్నమో రావణప్రభూ" ♦ యంచు నేడ్చు
వారు లంకలో నెవరు గ ♦ న్పట్టరారు. ౧౭౦

గీ. కలఁడు తోఁబుట్టువొక్కఁడు ♦ క్కలుఁడు రావ
ణునకు జగజెట్టి కుంభక ♦ ర్ణుండు, నిదుర
పోతు చిననాఁడె చౌదంతి ♦ పొడుగుకొమ్ము
లొడిసి చేపట్టి యుయ్యాల ♦ లూఁగినాఁడు. ౧౭౧

గీ. విపుల తంత్రజ్ఞుఁడైన వి ♦ భీషణుండు
పోకలాఁడు; పెద్ద వదరు ♦ బోతు ఖరుఁడు;
మాఱు తమ్ములు చెల్లెలు ♦ "మాటకారి"
శూర్పణఖ యన్నలకు ముద్దుఁ ♦ జూపుబిడ్డ. ౧౭౨

ఉ. శైవమతాభిమానియగు ♦ జంగమదేవర గావునన్ సదా
రావణభూవరుండు తన ♦ రాష్ట్రమునందున జీవహింస తా
నేవిధినైన మానుపుట ♦ యే మతధర్మమటంచు నెంచి యే
జీవులఁ జంపఁగూడదని ♦ చేసెను గట్టడి ధర్మలోలుఁడై. ౧౭౩

సీ. గొంతెత్తి తొలుసారి ♦ కోడికూయకమున్నె
పురవీథులను నూడ్చి ♦ తిరిగిపోవు
పడకమంచమునుంచి ♦ పడుచు లేవకమున్నె
మెల్లఁగాఁ గలయంపి ♦ చల్లిపోవు
వంటపుట్టియ సిద్ధ ♦ వడి చేరకయమున్నె
నీళ్లతోఁ బంజెలు ♦ నింపిపోవు
ముంగిల్లు సరిచేసి ♦ మ్రుగ్గుపెట్టకమున్నె
వెన్నాడి ప్రాయిరాజఁ ♦ బెట్టిపోవు

గీ. వాయుదేవుండు మేఘుండు ♦ వరుణదేవుఁ
డగ్ని దేవుండు తమయంత ♦ నరుగుదెంచి
ప్రాలుమాలక యేప్రొద్దు ♦ వరవుడంబుఁ
జేయుచుందురు లంకలో ♦ సిగ్గుపడక. ౧౭౪

ఉ. పాదులు కూలఁద్రోసి పగ ♦ వారల పౌజులఁ బట్టి యొక్కఁడే
బాఁదిగుదించి కట్టికొని ♦ వచ్చిన వారును సామియానఁ దా
మాఁదలఁదాల్చి కాదు మరి ♦ యా ననకుండఁగ నెల్లవేళలన్
జీదర మాటలేక పనిఁ ♦ జేయుచునుందురు లంకలోపలన్. ౧౭౫

చం. పురుషులతో సమానముగ ♦ బోటులు సర్వకళాభిరామలై
గురువులవద్ద విద్దెలను ♦ గోరిక నేర్చుటెకాక ఘోర సం
గరమున నస్త్రశస్త్రములఁ ♦ గైకొని యేయుట నేర్చి యందఱున్
గఱగటికన్ స్వరాష్ట్రమును ♦ గాచెడి పూనిక నుందురెప్పుడున్.

ఉ. ఇంకని పౌరసేవ యొక ♦ టే పరమార్థము నిచ్చునంచుఁ గూ
లంకషపాండితీగరిమ ♦ లాభముచేత గ్రహించి మంచితో
లంకిణి పెండ్లిమాని యమ ♦ లం బతులంబగు బ్రహ్మచర్యమున్
గొంకక స్వీకరించె బుధ ♦ కోటి "హసాద"నఁద్యాగశీలయై. ౧౭౭

గీ. పొలిసిపోని లంకారాజ్య ♦ మునకు నెల్లఁ
జేవఁగల లంకిణీదేవి ♦ చేతి కత్తి
వ్రేటు పెట్టని కట్టని ♦ కోటయయ్యెఁ
గనుగవను మూసి పౌరులు ♦ కునుకుచుండ. ౧౭౮

ఉ. లంకిణిఁగం చెలన్ దొడి, వి ♦ లాసముగాఁ గయిసేసి కాంచికా
కింకిణిజాలమున్ మొఱయఁ ♦ గింకిరిమూర్తుర ప్రాణగొడ్డమా
వంకిణి చేతఁబట్టి పరు ♦ వంబున రేఁబవ లొక్కకైవడిన్
లంకిణి శాత్రవుల్ బెదర ♦ లంకను గావలిగాయు నెప్పుడున్.

ఉ. రాజులు లంకవైపునకు ♦ రారు భయంబున లంకిణీ రిపూ
ద్వేజకమైన కత్తిఁగని ♦ బెళ్కుటి దానను శాంతిభద్రముల్
రాజిలు పౌరపాళి కవు ♦ రా! యిది కన్గొని లంకిణింగనన్
లాజలు చల్లుచుండెదరు ♦ లంకనుగల్గు పురంధ్రులందఱున్. ౧౮౦

గీ. ఆశ్రమంబులలో గృహ ♦ స్థాశ్రమంబె
యఖిలజనశిరోధార్యమా ♦ నంచుఁ దలఁచి
సోకుటిల్లాండ్ర తలపూస ♦ చుప్పనాక
చేకొనె గృహస్థధర్మంబు ♦ చింతలేక. ౧౮౧

గీ. కేలువట్టిన పెనిమిటి ♦ గూల, గోల
దండకావన సీమలోఁ ♦ దపము సేయు
నేకసుతుఁ డూతకోలగా ♦ నెగ్గతంబ
శూర్పణఖ ప్రొద్దులనుబుచ్చు ♦ సుగతిఁగోరి. ౧౮౨

ఉ. బోటులకెల్ల ధర్మము ప్ర, బోధముఁ జేయుచు జీవహింస బా
హాటముగాఁగ నాపు పని ♦ కై నిరతంబు విసుంగులేక యా
మాటలె చెప్పుచుండి మను ♦ మార్గముసందున సంచరింపుచున్
దాటక రాజయోగవరి ♦ తర్పితయై పురివీడి పిమ్మటన్. ౧౮౩

కం. వానప్రస్థము నూనుచు
మానుగఁ దాటకి మహాభి ♦ మానవతియనూ
చానమటంచును దండక
కాననమున సుతులఁగూడి ♦ కాపురముండెన్. ౧౮౪

వ. ఈగతి స్త్రీపురుషప్రభేదంబువలన స్వత్వంబులయందు వ్యత్యాసంబుఁ బొరయకుండ ధర్మసంరక్షణంబుఁ జేయుచు. ౧౮౫

ఉ. పంతముతోడ నన్య నర ♦ పాలురపైఁబడి దోర్విభూతి దే
శాంతర సీమలం గెలిచి ♦ యావలిపుట్టఁగ వారినెల్ల సా
మంతులుగా నొనర్చికొని ♦ మంతునకెక్కి యథేచ్ఛతోడ వి
శ్రాంతినిబూని రావణుఁడు ♦ రాజ్యముఁ జేసెడి కాలమందునన్.

సీ. గండోపలచ్ఛటా ♦ గండూషితప్రస్థ
వింధ్యపర్వతపంక్తి ♦ వెనుకనెట్టి
పంచాస్యశార్దూల ♦ వన్యేభసంకీర్ణ
ప్రస్ఫురద్దండకా ♦ వనముదాఁటి
ప్రావృట్సమారంభ ♦ బహూపయస్సంపూర్ణ
దుర్లంఘ్య నిర్ఝరుల్ ♦ దాఁకివచ్చి

విషసరీసృపచయూ ♦ విష్కంభ దుర్లోక
తృణలతాగుల్మముల్ ♦ తీసివచ్చి

గీ. యార్యసంఘంబు మునిపల్లె ♦ లచ్చటచటఁ
గట్టుకొని వేగువనికిన్నె ♦ కాపురంబు
లుండి బహుజంతుహింసా ప్ర ♦ యుక్త యజ్ఞ
యాగములు చేయఁజొచ్చిరి ♦ యాగకుండ. ౧౮౭

ఉ. మానినులెల్లరున్ భయము ♦ మాని విచారముమాని వెంటరా
మానిజనంబు దండము క ♦ మండలముంగొని పోయి పోయి, వే
కాననసీమలన్ నెమకి ♦ కాపుర ముండిరి పల్లెలన్ జన
స్థానమునందు గట్టుకొని ♦ దారులు కాయుచు మాఱుమూలలన్.

గీ. వృత్తవేది రావణుఁ డీ ప్ర ♦ వృత్తిఁదెలిసి
శైవమతవిరుద్ధంబైన ♦ జంతుహింసఁ
బెద్దప్రొద్దు చింతించి మా ♦ న్పింపఁదలఁచి
వీరసువు తాటకిని బిలి ♦ పించి పల్కె. ౧౮౯

ఉ. తాటకిసాధ్విరో! వినుము ♦ తప్పక యేమని చెప్ప నేర్తు? నా
నోటను మాటరాదు విన ♦ నోచితి నీవిపరీతకర్మముల్
మాటలఁదీరునే యాడలు ♦ మంటలప్రుంగుచు నుండఁగాన నో
పాటలగంధి! యెట్లయినఁ ♦ బాపవె! నావరితాపవహ్నినిన్.

గీ. ఆర్యులఁట నీతిపరులఁట ♦ యాహితాగ్ను
లఁట యెచటనుండియో వచ్చి ♦ రఁట మహోప
కారులఁట ద్రావిడులనఁట ♦ కాదనకఁట
దొడ్డమంత్రంబులఁ గణతే ♦ ర్తురట తల్లి. ౧౯౧

కం. నియతిన్ గోమేధంబఁట
హయమేధ మఁట నరమేధ ♦ మఁట చేతురటే

దయమాలి స్వార్థపరులై
వ్యయప్రయాసములు లేక ♦ యార్యమునీంద్రుల్. ౧౯౨

చం. ఎఱుఁగుదు నీకుమారకుల ♦ నిర్వార దుర్జయ బాహుసారులన్
దెరలని స్వామిభక్తులగు ♦ దిట్టగరాసుల వారితోడుతో
నరిగిన నీకుఁ దప్పక జ ♦ యంబగు సమ్మును మాటలేల? యీ
తరుణమునందుఁ గర్జమును ♦ ధైర్యముతో నొనరింపఁగాఁదగున్.

ఉ. కాదనఁబోకుమమ్మ, పని ♦ గల్గెనటం చెదురాడకమ్మ, త
ల్లీ! దరితెన్నుఁగానక చ ♦ లించెడి డెందము మానమానిని యీ
మాదిరి నూరకున్న నిష ♦ మంబగు దుర్గతి సంభవించు లె
మ్మా! దరిఁజేర్పుమమ్మ, మను ♦ మార్గముఁ బట్టిన నీకుఁదప్పునే?

చం. పరుసని మాటలాడకుము ♦ వారలతోఁ దగురీతి నేర్పునై
గరుసును దెల్పి యొప్పిదము ♦ గా మనయేల్బడినున్న సీమలన్
బరగెడి దేశధర్మమును ♦ వాకొని వారికి నచ్చునట్టులే
సరణిని జంతుహింస నిట ♦ సల్పఁగరాదని యార్తిచెప్పుమా.

గీ. ఆముకవినిసి విశ్వామిత్రుఁ ♦ డనెడి మాని
వరుఁడు గోమేధమును జేయ ♦ వలయునంచు
యుదియఁగొని యుండె నఁట వాని ♦ యుదియ యుడిపి
వెలఁది! యీపులుగాకు త ♦ ప్పింపవలయు. ౧౯౬

గీ. మన ముపేక్ష సేయునెడ నీ ♦ యనువునందు
ధర్మనాశనమానమ్మ ♦ తప్పకుండఁ
బాడువారి దేశము ప్రజా ♦ పీడగల్గుఁ
జావు కడులెస్స ధర్మర ♦ క్షణముకొఱకు. ౧౯౭

కం. మనతాతలు ముత్తాతలు
తనువులు బుడగలనుచు మదిఁ ♦ దలఁచియ కాదే

యనిసేయుచుఁ దెగటారిరి
జనములు మెచ్చఁగ స్వధర్మ ♦ సంరక్షణకై. ౧౯౮

సీ. రాజాజ్ఞ లేనిదే ♦ రాజ్యంబుఁ జొరరాదు
పరరాష్ట్రవాసులౌ ♦ ప్రజలు తెగువఁ
జొచ్చిరేనియుఁ జొచ్చి ♦ చొచ్చుటతోఁ దమ
రాకఁ దెలుపకుండ ♦ రాదు పతికి
ఉండిరేనియు నేత ♦ దుర్వీక్షుశాసన
ములనెల్ల జవదాఁటి ♦ పోవరాదు
పోయిరేనియు వారు ♦ భూపాలు శిక్షలఁ
దిన్నఁగాఁ దలఁదాల్చి ♦ తీరవలయు

గీ. చోరులంబోలె దేశంబుఁ ♦ జొచ్చి వారు
పూని ధర్మవిరుద్ధంబు ♦ లైన పనులు
చేసి రాజాజ్ఞ ప్రతిఘటిం ♦ చెదరు, దండ్యు
లైరి యాకారణముచేత ♦ ననుచుఁ దెల్పె. ౧౯౯

గీ. మంచిమాటల జన్నంబు ♦ మానిపింపు
లేద దండకాటవినుండి ♦ లేవఁగొట్టి
పొమ్మను మాఁటన్న నామంత్ర ♦ ణమ్మువడసి
చనియెఁ దాటకి రాజాజ్ఞఁ ♦ జక్కఁబెట్ట. ౨౦౦

ఉ. పూఁచిన కార్యభారమున ♦ మున్నడి తాటకియింటికేగి మా
రీచసుబాహులం బిలిచి ♦ ఈని యనుజ్ఞనుదెల్ప వారలున్
లాఁచి నితాంతశక్తిని జ ♦ లంబునఁ దల్లిని గూడి దివ్యవ
స్త్రాచితదేహులై వెడలి ♦ యందఱు చేరిరి యజ్ఞవాటికన్. ౨౦౧

గీ. చేరి గాధేయునకు ఱేఁడు ♦ చెప్పినంత
పూస గ్రుచ్చినకైవడి ♦ బోధపఱప
నెంత లేసిమాటలని గ్రు ♦ డ్డెఱ్ఱఁజేసి
నిప్పు ద్రొక్కిన కోఁతియై ♦ నెగిరిపడుచు. ౨౦౨

శా. కాపేయంబునఁ గ్రిందుమీఁదెఱుఁగకా ♦ కంపించు దేహంబుతోఁ
గోపాటోప విఘూర్ణమానుఁడయి సం ♦ కోచంబు నేమాత్రముం
జూపంబోవక కౌశికుండపుడు గ్ర ♦ చ్చుల్ గొట్టి వాచాలుఁడై
మాపట్టున్ విడఁబోవమంచుఁ బలుకన్ ♦ మర్యాద లేకుండఁగన్.

గీ. పలుకు లాలించి సంక్షోభ ♦ పడక, యుదరి
పడక, మోమోటపడక ని ♦ బ్బరము చెడక
తాటకీసాధ్వి రాజాజ్ఞ ♦ తప్పదనుచుఁ
జాఱఁజూచి పుత్రులవంక ♦ బఱటినంత. ౨౦౪

గీ. పట్టుమంచు మారీచ సు ♦ బాహులపుడు
పట్టు విడనాఁడవో మృషా ♦ బ్రాహ్మణుండ!
కాంతు మీవేమి సేయఁగాఁ ♦ గలవో యంచు
యజ్ఞ విఘ్నంబు సల్ప నా ♦ యత్తపడుచు. ౨౦౫

సీ. యూపంబులకుఁ గట్టి ♦ యున్న యాఁబెయ్యల
మెడత్రాళ్ల సడలించి ♦ విడచిపుచ్చి
చిద్రుపలుగాఁగొట్టి ♦ చేర్చియుంచిన రాని
చిదుగు కుప్పల పేళ్లు ♦ చిమ్మివైచి
గుమగుమ తావి యా ♦ గుబ్బగాఁ గొట్టు నా
వుల నేతి సంకెల ♦ బోర్లగించి
కుండంబులోనుండి ♦ కొలఁది నాల్కలుగోయు
నగ్నిహోత్రమ్ముఁ జ ♦ ల్లార్పివైచి

. దర్భలను నాల్గుమూలలం ♦ దరలవైచి
సాఱుఁబోతులం బెదరించి ♦ సాఱఁద్రోల
మిన్ను విఱిగి కూలినమాడ్కి ♦ మిణకరించి
చూచిచూచి యప్పుడు గాధి ♦ సూనుఁడంత. ౨౦౬

గీ. ప్రాఁతలాతాము మెల్లగాఁ ♦ జేతఁబట్టి
చంక నిఱికించి చినిఁగిన ♦ జింకతోలు
లెండు లెండంచు శిష్యుల ♦ లేవఁదీసి
తల్లడిల్లి సాకేతంబు ♦ దారిపట్టి. ౧౦౭

ఉ. కూఁకలు పెట్టుచుం బెదరఁ ♦ గొట్టుచు నట్టడవిన్ వసించి కా
రాకులు కూడుగా, మెసవు ♦ నట్టి మునీంద్ర జనంబుమీఁదికిన్
దూఁకులుదూఁకి కావరము ♦ తోఁ దెగనాడిరటంచు రాజుతో
సాకులు చెప్పుచుం దగిన ♦ శాస్త్రియానర్చ్ఛదనంచుఁ జెప్పుచున్.

ఉ. గోవులఁ జంపినంత తమ ♦ కొంపమునుంగునె? వీరి కక్కటా!
గోవులు గోవులంచుఁ బయి ♦ కొందురు తద్వ్యథనాపద్రావిడుల్
గోవుల మాంసపుంజవులు ♦ కొద్దిగనైన నెఱింగియున్నచో
గోవులఁ జంపఁగూడదని ♦ గొల్లునఁ జెప్పుట వీరు మానరే.

గీ. ఎంతయత్నంబుఁ జేసిన ♦ నేమివచ్చె?
నావు నెఱచిని రుచిచూడ ♦ రైరి వారు
సోమపానంబునుం జని ♦ చూడరైరి.
ఇందుచే నిన్నియిక్కట్టు ♦ లేగుదెంచె. ౧౧౦

ఉ. అమ్మరివోసి చుల్కనగ ♦ నాఁడుది సైతము లక్ష్యశుద్ధితోఁ
గిమ్మనకుండ శాత్రవులఁ ♦ గీటడగించుచు కాక ఘోరసై
న్యమ్మును నిక్కుతోనని మొ ♦ నన్ నడిపింపఁగనేర్చు నిట్టి రా
జ్యమ్మును దొల్లి యేనెఱుఁగ ♦ నైతిని నైతి మెటో జయింపఁగన్.

గీ. పోటుకానితోడఁ ♦ బోటుకత్తియ కూడ
నిలిచి పోరుచుండ ♦ నిలువఁగలరె
వైరులెంత గండు ♦ వజ్జీరులైనను?
మాట దక్కఁబోదు ♦ మాటలేల? ౧౧౨

గీ. బొమ్మముడివేసి తలముడి ♦ పుచ్చుకుండ
అనికముడి వేయునట్టు లా ♦ ఘవముగొరల
నరుల ముడివేసి ముడిచేవ ♦ నరులగొంతు
ముడి నురలఁబుత్తు రిచ్చటి ♦ ముద్దరాండ్రె. ౨౧౩

వ. అంచుఁ జింతించుచుఁ జింతాకులమానసుండై, శిష్యులంగూడి యిటునటు చూడక, యడుగులు లెక్కించుకొనుచుఁ గాలినడకతో, గాలిపాటునకు జంకక, గాలిపాటలు పాడుకొనుచు నెమ్మదిగా. ౨౧౪

ఉ. ఏరులు దాఁటి వాటముగ ♦ నెన్నియొ క్రొంచలిరాకు బాటలన్
నేరుగ దండకావన ని ♦ ర్గమనంబొనరించి పిమ్మటన్
వారక భంగపాటు పొర ♦ పాటును దల్లడపాటు పెట్టఁగా
నూరక గాధినందనుఁ డ♦యోధ్యకుఁబోయెను దొ్రుపాటుతో.

చం కులపతియౌ వసిష్ఠముని ♦ కొంపను జొచ్చి రహస్యపద్ధతిన్
గల తెఱఁగెల్లఁజెప్పి యిది ♦ కాదది కాదని దీర్ఘదృష్టితోఁ
బలుమరు చర్చఁజేసి యిది ♦ భావ్యమటంచును నిశ్చయించి తా
వెలలెను గౌశికుండు పృథి ♦ వీపతిదర్శనసంభ్రమంబునన్.

చం. దశరథభూమిపాలకుని ♦ దర్శనముం బొనరించి ప్రీతితోఁ
గుశలమునడ్గి యేమిపని ♦ కోరనివానినిబోలె సర్వమున్
విశదముగా నెఱింగి తన ♦ విహ్వలభావము తోఁపకుండ నా
కుశికతనూభవుండు కొన ♦ గోళ్లను గడ్డము చిక్కుదీయుచున్.

చం. పొరపడకుండఁ దొ్రుపడఁ ♦ బోక గరాగరి మంచిమాటలన్
నరవరు మోముపాటుఁగని ♦ నమ్మకముం జెడకుండఁ జక్కఁగా
సరిపడునట్లుగా నొరులు ♦ నైతము మేలని మెచ్చురీతిఁగా
వదుసగఁ జెప్పె నిట్లు నర ♦ పాలుని క్రొమ్మాలను జాల జాలితో,

సీ. పాపభూయిష్ఠ ప్ర ♦ వర్తనంబును బాసి
సంసారసంబంధ ♦ సరణి రోసి
బహుళజనాకీర్ణ ♦ పట్టణంబుల వీడి
కారుపల్లెలలో నె ♦ కాలఁగూడి
ప్రత్న శిష్టాచార ♦ పథమట్టె చేపట్టి
మొలచుట్టు పాఱుటా ♦ కులనుజుట్టి
ఐశ్వర్యములనెల్ల ♦ నఱుకాల దిగఁదన్ని
భాగ్యభోగ్యములన్ని ♦ పాఱఁదన్ని

గీ. షడ్రసోపేతమైన భో ♦ జనముడించి
కాయగసరులతో నెట్టొ ♦ కడుపునించి
పారమార్థిక చింతతోఁ ♦ బరముఁగొల్చి
బ్రదుకుచుంటిమి తాపసా ♦ శ్రమముఁదాల్చి. ౧౧౯

గీ. సూరవంశాభి వృద్ధిని ♦ గోరి కాదె
యారితేరిన మేధావు ♦ లైన మునులు
దండకావనిఁ జేరి యం ♦ దుండి తపముఁ
జల్పుచెల్లను నగచాట్ల ♦ సరకుగొనక. ౧౨౦

గీ. ఆర్యులనుపేరు విన్నంత ♦ నచటి రాజు
లాగ్రహోదగ్రులై వారి ♦ హతమొనర్ప
సిద్ధమాదురు మావంటి ♦ శీర్ణదేహు
లేమి సేయంగ నేర్తురో ♦ నృపతిచంద్ర ! ౧౨౧

సీ. నెలయెల్ల నీళ్ల దో ♦ సిళ్లతోఁ గడుపాఱఁ
ద్రావి ముప్పూటలఁ ♦ దనియుచుండి
పండి రాలిపడిన ♦ యెండుటాకులు పండ్లు
నొంటిపూట భుజించి ♦ యూదిగియుండి

పూలతావులలోనఁ ♦ బొరలివచ్చెడి గాలిఁ
గోర్కెమైఁ దనివోవఁ ♦ గ్రోలుచుండి
మనసుపోయిననాఁడు ♦ మాత్ర నివ్వరిభోజ
నముఁ జేసి పొట్టులో ♦ నవయుచుండి

గీ. యుడుకయిూరాలపొంత గూ ♦ ర్చుండు మమ్ము
నడవి నేకములం జూచెడు ♦ నట్టు చూచి
యెక్కసక్కెములం జేతు ♦ రేవగించి
జాతి వైరంబు మనసులో ♦ సందడింప. ౨౨౨

గీ. ఎంతదూరంబు తఱిమి ము ♦ నీశ్వరుండు
చెప్పుచుండిన దశరథ ♦ క్షితివరుండు
మాటలాడకుండిన యంత ♦ మసలివడుచు
నుల్లకుట్టు మాటలచేత ♦ నులికిపడఁగ. ౨౨౩

ఉ. దూరముఁ బాఱఁజూడు చెని ♦ దూరవు నేనిపుడాడుపల్కులం
గారణమేమియో తెలుపఁ ♦ గాఁదగునయ్య యసహ్యమయ్యెనే?
పాఱులు నిల్వనేరని నృ ♦ పాలురరాజ్యము వృద్ధిఁబొందునే?
కారియలందఁజే నృపతి ♦ కష్టపరంపర రాక తప్పునే? ౨౨౪

కం. పులినోటి కండవలె మూ
నులు ముప్పొద్దుల మహా మ ♦ నోవ్యథచేతన్
గళవళపడి నిలువంగాఁ
దెలియని వానివలెనుండఁ ♦ దెలిసిన పనియే? ౨౨౫

గీ. తెలిసికొనవా నీరాజ్య ని ♦ స్తృతికిఁగాదె
ఋషులు దండకావనసీమ ♦ కేగి యుండె
నిలిచి పోయినారిది నీవు ♦ తలపవెట్లు?
ఇంతటి కృతఘ్నతను నే స ♦ హింపఁజాల. ౨౨౬

ఉ. చొచ్చిరి దండకావనము ♦ శుష్కశరీర విషణ్ణచిత్తులై
నొచ్చిరి ద్రావిడప్రభుల ♦ నూరినవెళ్లెడి చిక్కటారులన్
వచ్చిరి నేఁడు దిక్కనిభ ♦ వచ్చురణంబును గోరి వారలన్
గ్రచ్చుఱ నాదరించి, యువ ♦ కారముసేయ వదేమి చెప్పవూ

కం. కుశికసుతుం డిటులాడఁగ
దశరథుఁడుం గటకటపడి ♦ దైన్యముతోడన్
దిశలూరక కన్గొనుచు వి
వశుఁడగుచు వచించెనిట్లు ♦ భయభక్తులచే.

చం. కులపతులౌ మునీశ్వరుల ♦ కున్ వలవంతలు గల్గుచుండ
కులపడకుండ నుండుదుమె?♦కొండలమందదె మాదు వెంద
నిలయము వచ్చిపడ్డ రఘు ♦ వీరులు పాఱులఁ బ్రోవకుం
త్రుల మొగసాలముందుఁ బడ, ద్రోతురె? యెందులకిట్టినింద

కం. ఇదె! పోదము రాఁగదె దో
ర్మదమున ద్రావిడులు పోవు ♦ మార్గము లెల్లన్
వదలక యరికట్టెద నా
ప్రదరములకు నెవ్వరడ్డు ♦ పడఁగలవారో!

చం. తడయఁగ వద్దు పోవుదము ♦ దండక కాననసీమ కిప్పు
గుడుసువడంగ సింగిణి ల♦కోరులు "రంయిని" దూఁకుచుం
గెడపెద నేను మార్తురను ♦ గీటడగించెద ద్రావిడప్రజ
గడగడలాడఁజేతు గమి ♦ కాండ్రను గాండ్రని బొబ్బవె

గీ. అబము సుబమే మెఱుఁగని నా ♦ యట్టివాని
మీఁద నిందమోపుట ధర్మ ♦ మే? మహాత్మ!
విప్ర సంతర్పణంబైన ♦ పిదపఁ గాదె?
యేము భక్తితో భుజియించు ♦ టింతొ యంతొ.

ఉ. ఏయుగమందు మా రఘుకు ♦ లేశులు భూపతులన్నమాట కా
నీ! యెప్పుడైన నొక్కపని ♦ యేని స్వతంత్రతఁ జేసినారలే?
యీ యనుమానమేల? పదుఁ ♦ డీ! యిపుడే పయనంబయైతి స్వా
మీ! యిటువంటి పల్కులు స ♦ హింపఁగనేరను వేయునేటికిన్.

కం. అనిచెప్పుచు నుండంగాఁ
జనుదెంచి వసిష్ఠమౌని ♦ సాంతముగాఁ దా
విని సర్వోదంతంబిటు
జనపాలుని తోడఁబల్కె ♦ ధర్మముతోడన్. ౨౩౪

కం. కడువృద్ధుండవు నీవి
క్కడ నిలిచి యుండి యేలఁ ♦ గల్గుదుగానీ
యడవుల వెంబడిపడి క్రు
క్కడి మానవులఁ బడఁగూల్పఁ ♦ గల్గుదువొక్కొ! ౨౩౫

చం. చెలువముకగ్గ నీవయసు ♦ చెల్లఁ బటుత్వము కొంతతగ్గ నీ
కిలపయిఁ దీరఁగాఁదగు న ♦ భీష్టము లెల్లను దీరిపోవ నీ
యలవుచలంబు నెందులకు ♦ నక్కఱరా వదిగాక నీతనూ
జులకు విరోధిమారణముఁ ♦ జూఱగొనంగను నేర్పఁగాఁదగున్.

ఉ. కావున రామలక్ష్మణుల ♦ గాదిలి బిడ్డల నిర్వురన్ మహా
పావనుఁడైన మౌనికుల ♦ వర్యుని చేతను బెట్టి పంపుమా
పూవులలోన పెట్టికొని ♦ పోయి విరోధిచమూసమూహముం
జావఁగఁ గొట్టి తెచ్చి మన ♦ సన్నిధి నుంపఁగలండు భూవరా!

గీ. భానువంశంబునకు వన్నె ♦ వాసికల్గఁ
జెలఁగి నీకీర్తి దెసలెల్లఁ ♦ జిందుఁద్రొక్క
వెనుక ముందు యోజనలెల్ల ♦ విశదిపెట్టు
మంచుఁ జెప్పఁగా దశరథుఁ ♦ డావులించి. ౨౩౬

గీ. కంటినీటితో బిడ్డల ♦ జంటచేసి
చివుకుమన గుండె మానీంద్రు ♦ చేతఁబెట్టి
శోక మెటుమాన్తురో నాకు? ♦ లేకలేక
కన్నసంతాన మియ్యది ♦ కావుమన్న! ౨౩౯

చం. చెఱియొకవైపునన్ నిలిచి ♦ చిందులుద్రొక్కఁగ రామలక్ష్మణుల్
మురియుచుఁ గౌశికుండు తన ♦ ముప్పు దొలంగెను నేఁటితోడ నం
చురవడిఁ బైనమయ్యెఁ జటు ♦ లోగ్రభయంకరదండకాటవిన్
జొరి పరిమార్ప ద్రానిడులఁ ♦ జుబ్బన చూఱఁగ నిబ్బరంబుగన్.

ఉ. పిన్నలు రామలక్ష్మణులు ♦ బెగ్గిల వచ్చును వింటిమ్రోఁతలన్
విన్నను వేగిరింపఁ జెడు ♦ పేయగుఁ గావున మెల్లమెల్లఁగా
వెన్నునఁ దట్టి భీతి యొక ♦ వేళ ఘటిల్లినఁ బోవఁబుచ్చి రా
మన్నకు మున్నుగాఁ దెగువ ♦ యబ్బెడు కైవడిఁ జేయుటొప్పగున్.

గీ. అనుచుఁ దలపోసి పోసి య ♦ సంతరమ్ము
తికమకలు మాని మాని యు ♦ ద్రేకమడఁచి
యొక యుపాయంబు నూహించి ♦ యొరులకేమి
చెప్పకుండఁగాఁ గార్యంబుఁ ♦ జేయనెంచి. ౨౪౨

చం. ముఱిముఱి చీఁకటుల్ దెసలు ♦ మూసెడివేళ నరణ్యసీమ నొం
టరిగ వసించు తాటకిఁ ద ♦ టాలునఁ బైఁబడి గూల్చుటొప్పుఁ బొం
దరపడకుండ నాఁడుదిగ ♦ దా! యెటుపో యెటువచ్చినన్ సరే
బెరలఁగవచ్చు రామునకుఁ ♦ దీరఁగవచ్చు భయంబు కల్గినన్.

వ. ఈగతి ననేకవిధంబుల నూహించుచుఁ బ్రొద్దు పడమటిదిక్కునకు వ్రాలుటఁ దలంచి యుత్తలంబున. ౨౪౪

ఉ. ఎత్తిలి కాలిబాటఁబడి ♦ యేగుచు సంయమి దారిలోఁ బురా
వృత్తము లెన్నియేని విని ♦ పించుచు శౌర్యము పొంగిపోవఁగాఁ
జిత్తములోన సాహసలోనిఁ ♦ జిక్కురు బొక్కురుగాఁగఁ బుట్టఁజే
సెత్తినఁ గాలుద్రవ్వునటు ♦ లెంతయుఁ జేసెఁ గుమారు లిర్వురన్.

## తృతీయాశ్వాసము.



ప. ఈప్రకారంబునఁ గొంతదవ్వేగి సంభ్రమించుచు విశ్వామిత్రుండు రాముం జూచి ప్రసన్నవదనంబుతో నిట్లు మూదలించి పల్కెను. ౨౮౫

ఉ. అల్లదె! చూచితే! యట జ♦మక్కడ నొక్కటి దానిలోపలన్
గల్లలమారిదైన యొక ♦ కామిని తాటకి పేరితోడ రే
ల్లెల్ల వసించు నీమె హింసి♦యించెడి నార్యుల గొన్నులంచు నీ
యల్లరి రూపుమాపవలె♦నాయమునుం బాలిమ్ముఁ జేయుమన్.

కం. ఆఁడుదియని తండ్రీ! యెడ
రాడకు నీవింటికి నెఱ ♦ యగునటుగాఁ బూఁ
టాడుము దయమాలుచు నీ
యాఁడుది జగజెంత యెంత ♦ కైననుజాలున్. ౨౮౭

సీ. అనిన వెంటనే నరపాల ♦ తనయు లెత్తి
విల్లు సవరించి సరిచేసి ♦ సింజిని నియకి
దూసి కలకుటమ్ములఁ గవ ♦ దోసలనుండి
నారి మ్రోయింప దెసలెల్ల ♦ బూరటిల్ల. ౨౮౯

ఉ. తాటకి వింటిమ్రోఁతవిని ♦ దబ్బున బైటకువచ్చి నిల్వఁగా
వాకెఁడు తూపులన్ సుదతి ♦ పైఁ గురియించిరి చిత్రజల్లుగా
గాటులుబెట్టుచున్ దుడకు♦గాళ్లను జేతులు త్రుంచిత్రుంచి యు
చ్చోటనె కూల్చివైచి రతి ♦ శూరులు గారె కుమారులిర్వురున్.

సీ. ఇంతమొగముఁ జేసికొని ము ♦ నీశ్వరుండు
కేకిసలు గొట్టుచుండ సిం ♦ గిణుల మొక్క
డించి మూఁపుదోయికి దగి ♦ లించి రామ
లక్ష్మణులు నిల్చియున్నంత ♦ గ్లానిలేక. ౨౯౧

డయ్యెను. రామలక్ష్మణులతోఁ గొంతకాలంబు తన యాత్రమంబున విశ్రమించి వారిచే నగు కార్యము లేమింజేసి విశ్వామిత్రుండు తిన్నగా వారలం దోడ్కొని దుక్కిదున్న ననువు గాని వేవిలిమెట్టదారుల నెఱిడిఫాలములంబడి, మిథిలకుం గొంపోయి, యందుఁ బదిపండ్రెండు తరములనుండి, పడియుండి, చివికి చెదదిన్న పెద్ద ప్రాతవింటిబద్ద, విఱిపించి, రాజకీయ సఖ్యంబు నపేక్షించి, యార్యులయందలి రెండు తెగలవారికిఁ జుట్టఱికం బెట్టులయినఁ గూర్పఁ గట్టిచేసికొని, శ్రీరామునికంటెఁ బెద్దదియుఁ దెలియని పుట్టుపూర్వములు కలదియు నగు సీతామహాదేవిని, శ్రీరామునకుఁ బెండ్లిచేయించి, సాకేతంబునకుఁ దిరిగివచ్చుచు, దారిలో ముసలివగు వడుగైన పరశురామునిఁ దన గురుధనుర్భంగముచేఁ గుపితుఁడైనవాని బదరి వానిని వింధ్యాటవులం దాఁటి దక్షిణాపథమున మాఱుమూలనున్న కేరళదేశంబునకుఁ బోయి యందు నార్యనాగరికత వ్యాపింపఁ జేయ నొడంబఱచి పంపి యయోధ్యకరిగి యందు రామలక్ష్మణుల డించి కౌశికుం డెందే యేగెను. ౨౫౩

గీ. రాజ్యతృష్ణ తీరని దశ ♦ రథుఁడు రాజ్య
భారమును రామునకు నీక ♦ పాలనంబుఁ
జేయుచుండ శ్రీరాముండు ♦ సీతఁ గూడి
కామతంత్రుఁడై ప్రొద్దులు ♦ గడపుచుండె. ౨౫౪

సీ. తోడుతో నాఁడునె ♦ త్తురుఁ ద్రావి కడుపాఱ
తెపతెపలాడు మా ♦ నుపులులైన
చిచ్చుఱమ్ముల పిండు ♦ చెలరేఁగి కవదొనల్
త్రోపాడి నాలుకల్ ♦ గ్రోయుచుండ
ద్రావిడ మన్నీల ♦ ప్రాణంబుల హరింప
శ్రీరామ చంద్రుండు ♦ చింతఁ జేసి

సీ. ముక్కువాతను నెత్తురుల్ ♦ గ్రక్కి గ్రక్కి
చాపకట్టుగాఁ బుడమిపైఁ ♦ జచ్చిపడిన
పడతిఁ బెడనవ్వుతోఁ జేరి ♦ పాఱఁజూచి
మౌని సాఁగెఁబో రామల ♦ క్ష్మణులఁగూడి. ౨౫౨

వ. ఇట్లు వేయిమాసంబుల ప్రాయంబు చెల్లి నూఁడుకాళ్ల ముదుసలియగు తాటకిని యౌవనప్రాదుర్భావమునఁ గలిగిన కండక్రొవ్వున మిట్టిపడుచున్న యిర్వురు రాకుమారులచేఁ జంపించి యాడలు తెలియక సల్లాపంబు లాడికొనుచుఁ గలఁక దేఱని మనంబుతో రామలక్ష్మణుల యింటి నేర్పు ముక్కెకలందీకిన ద్రావిడహంవీరవరుల నేర్పునకు నుద్దికాదని సంశయగ్రస్తుండై విశ్వామిత్రుండు పాలువోక ముందునకు సాఁగిపోవుచు మచ్చరంబునఁ దనపూర్వాశ్రమంబున నేర్చికొన్న యఖిలాస్త్రశస్త్రంబులఁ దొడుగను, నేయను, ముడువను నేర్చి, తన యాశ్రమంబుఁ జొచ్చి తల్లడపడుచున్న మనంబుతో, సంబారంబులఁ గూర్చికొని, చవిచచ్చియున్న నాలుక త్రుప్పుడుల్లపుచ్చు వేగిరపడుచు, గోమేధంబును జేయ యత్నించుచుండెను. ఇంతలో మాతృమరణంబు నెఱింగని, మారీచసుబాహులు, తల్లియానతిఁ దలమోయుచున్నవారు గావున యజ్ఞవిఘ్నంబు నాచరింప సమకట్ట శ్రీరామభద్రుఁడు నాఁడు నెత్తుటి తడి యారని చేతితో వాఁడియమ్ములు దొడిగి చీకటి యోలంబున నిలిచి, సడిదప్పుడు కాకుండఁ జెవిఁ దాఁకువఱకు లాగి, విడువ నందొక్కటి సుబాహు ప్రాణంబుల హరియించె, రెండవది లక్ష్యశుద్ధి కొఱవడుటచే గుఱితప్పి, మారీచు ప్రాణంబుల హరియింప నోపకఁ డిల్లపడునట్లు భూమిపై డొల్లఁజేసె. అంత వతండు భీతిఁగుడిచి పలాయితుండయ్యె. పిమ్మట విశ్వామిత్రుండు నిరాతంకంబుగా యజ్ఞపరిసమాప్తిఁ గావించి, రామలక్ష్మణుల చేతి లావు చాలమిఁ జక్కగా గ్రహించి ఖిన్నుండవలసినవాఁ

ఏమెక్కచేనైన ♦ నిల్లువాకిలిడించి
దండకారణ్య భూ ♦ స్థలికి నేగి

గీ. యార్యరాజ్య విజృంభణ ♦ మాచరింప
మంచి తరికోసరం బట్టె ♦ పొంచియుండ
నింతలో రాజు వార్ధక్య ♦ మెనయఁదన్నుఁ
జెలఁగి పట్టాభిషిక్తునిఁ ♦ జేయనెంచ. ౨౫౫

ఉ. కేకయ రాజపుత్రిఁగని ♦ క్లిష్టపరిస్థితిఁ బూసఁగుచ్చిన
ట్టేకరువెట్టి యేకరశి ♦ నేనియుఁ దల్లిరో! దండకాటవీ
ప్రాకట వీధులందిరుగు ♦ భాగ్యము నాకొడఁగూర్చిపంపవే
వేఁకమెయిన్ వివల్తు రివు ♦ వీరుల, రాజ్యము పెంపుచెందఁగన్. ౨౫౬

గీ. రాజు సంతుష్టుఁడైనచో ♦ భ్రష్టుఁడగున
టంచుఁ బెద్దలు నుడువు వా ♦ క్యమ్ములన్ని
యెఱుఁగుదువు కాదె? తల్లి! నా ♦ కేడుగడవు
నీవుదక్క వేఱెవ్వరు ♦ నేఁడు కలరు? ౨౫౭

కం. అని యీగతి శ్రీరాముఁడు
పినతల్లినిఁ జేరి పలుకఁ ♦ ప్రేమముతోడన్
విని కేకయ రాజాత్మజ
చనువున వచియించె నిట్టు ♦ చతురోక్తులతో. ౨౫౮

పరిలెమ్ము కన్నతండ్రీ!
తరుణము కనిపెట్టియుండి ♦ తప్పక నేనే
వెరవున నైనను నీపని
పరిఁజేసెద నమ్ముమెట్టి ♦ సడ్డిపైఁ బడినన్. ౨౫౯

ని కైకేయి వచియింప శ్రీరామచంద్రుండు ప్రహృష్టాంత
గుండై, పినతల్లివద్ద సెలవుంగైకొని వెడలిపోయె. అటుపిమ్మట

